

# 10. సికింద్రాబాదు బృహద్వాశిష్ఠపీఠం అన్నావధూత (1820-1889)

ఆంధ్రదేశంలో అచలమార్గం ప్రతిష్ఠాపించినవారు ఇంతకాలం రామడుగు శివరామదీక్షితులే (1690-1791) అనుకున్నాను. వారి గురువులు శ్రీధరులు (1658-1730) మహారాష్ట్రులు. శ్రీధరుల మరొక శిష్యపరంపర కూడ ఆంధ్రదేశంలో అచలమార్గం బోధించినవారున్నారు. వారు రామావధూత-సదానందులు-వెంకటేశ్వర యోగి- వేపురు అన్నావధూత,మొలకలూరు హుసేన్‌దాసు, నాగానందులు- (స్వామిదేవులు, వేటపాలెం దోగుపర్తి స్వామిగుప్త సిద్ధాంతి, గుత్తిలక్ష్మయ్య, గుత్తి వెంకట సుబ్బయ్య) ప్రభృతులు. ఇందులో శ్రీధరుల శిష్యుడైన రామవధూత సోలీపురం యోగానంద నరసింహస్వామికి (1798-1899) (ఆంధ్రయోగులు ద్వితీయభాగం పుటలు 66-79) అచలం బోధించిన రామావధూత భిన్నులో అభిన్నులో తెలియదు. సదానందులు తెలుగువాడే. ఆతని పద్యాలు తత్త్వాలు అచ్చైనవి. నా చిన్ననాడు మడికొండలో పొరుగింటి తంబళి ముత్తిలింగం పాడగా విన్నాను. వెంకటేశ్వరయోగి గూర్చి అంతగా తెలియదు ఆయన శిష్యుడు మన కథానాయకుడు అన్నావధూత. ఆయనకు భూమానందు లనే పట్టనామం ఉంది.

అన్నావధూత రచనలు 1. రాజేశ్వరశతకము, 2. హంసశతకము, 3. గురువాక్య తారావళి, 4. గురువాక్య సుధారసము, 5. అఖండానంద బోధార్థ అద్వైత కందార్థ దరువులు, గీతములు, 6. పరబ్రహ్మానంద విలాసము, 7. అన్నావధూత వాగ్భూషణము, 8. చరమానుష్ఠానము, 9. ఉపదేశ రత్నమాల, 10. శివజ్ఞానాష్టకము, 11. పంచదశి పరమతత్త్వములు. ఇందులో మొదటి ఐదు ప్రథమభాగముగా అఖండానందబోధయను అన్నావధూత అనుభవప్రకాశిక పేరుతో సికింద్రాబాదు గుండా భూమయ్య గుప్త (కార్యదర్శి) 1930 సంవత్సరం ప్రకటించినాడు. పైకృతులు మొత్తం ఒకేచోట రెండవకూర్పులో ప్రకటిస్తామని సవరణకర్త సచ్చిదానంద వెంకటేశ్వర అవధూత ప్రథమముద్రణలో పేర్కొన్నారు. ఈ వెంకటేశ్వర అవధూత ఫీల్ఖానా లక్ష్మణప్రభువుల శిష్యుడు. అన్నావధూత గురువు వెంకటేశ్వరయోగి కంటె భిన్నుడు. ఐదు రచనలు ప్రథమ భాగముగా అచ్చైనకృతి నాకు శ్రీ ఉప్పలంచి కృష్ణమూర్తిగారివద్ద లభించినది. దీని అవతారికలో అన్నావధూతల గురుపరంపర వర్ణనలు (రెండు శీర్షికలు) అన్నావధూతల చరిత్రసంగ్రహము ఉన్నవి. చరిత్ర సంగ్రహం చిట్టచివరన అన్నావధూత విరోధి సంవత్సరం మార్గశిరశుద్ధఅష్టమి శనివారం పగలు3 గంటలకు (30-11-1889) కైవల్యం చెందినట్లున్నది. ఆయన జననం తేది తెలియదు. భాగవతుల కృష్ణప్రభువు అన్నావధూత సమకాలీనులు అన్నావధూత కృష్ణప్రభువుకంటె కొంచెం పెద్దవాడని ప్రతీతి. కనుక ఆయన 1820 ప్రాంతమున పుట్టియుంటాడని ఊహించినాను.

సికింద్రాబాదు వాస్తవ్యులు వేపురు నృసింహార్య వెంకమాంబ అనే వంజరి దంపతులకు ఈశ్వరానుగ్రహంచేత కలిగిన కొడుక్కు అన్నయ్య అని నామకరణం చేసి గారాబంగా పెంచినారు. తెలంగాణంలో వంజరికులజులు వడ్డీవ్యాపారులు. అన్ని జిల్లాలలో ఉన్నారు. అన్నయ్య తల్లిదండ్రులయెడ పెద్దలయెడ శ్రద్ధాభక్తులు గలవాడై తెలుగు సంస్కృతాలు గట్టిగా చదువుకున్నాడు. కనపర్తి సంప్రదాయజ్ఞులవద్ద ఋగ్వేదం పఠించినాడు. (శూద్రుడైన అన్నయ్యకు ఆ దినాలలో వేదం చెప్పిన కనపర్తివారు బ్రాహ్మణులో విశ్వబ్రాహ్మణులో తెలియదు) అన్నయ్య పెరిగి పెద్దవాడైనాడు. సికింద్రాబాదు

తిరుమలగిరి బ్రిటిషు సైన్యావాసం. తిరుమలగిరిలో బ్రిటిషువారు భవనాలు నిర్మించు కుంటుండగా ఉదర పోషణకై అన్నయ్య వారిచెంత టైమ్‌కీపర్ కొలువు చేసినాడు. అప్పుడు తిరుమలగిరి నిర్జనారణ్యపర్వతప్రాంతం. పర్వతగుహల్లో సంచరించే యోగులో వనదేవతలో ప్రత్యక్షమై అన్నయ్యకు సుజ్ఞానం బోధించినారు. అన్నయ్య విరాగియై జ్ఞానులను సేవించి తరించవలెననే దృఢనిశ్చయంతో ఇల్లు విడిచినాడు. ఆ దినాలలో హుమ్నాబాదు మాణిక్యప్రభువు (1817-1865) దత్తావతారు లుగా ప్రసిద్ధులు. అన్నయ్య హుమ్నాబాదుకు కాలినడకన బయలుదేరినాడు. మార్గమధ్యంలో ఒక గ్రామంలో నిలిచి ఒక గృహస్థునింట ఆతిథ్యం అందుకున్నాడు. మార్గాయాసపు బడలికతో నడుం వాల్చినాడు. నిద్ర పట్టలేదు. ఇంతలో గృహయజమాని ఆతనిభార్య పూలు పండ్లు తీసుకొని ఎటకో బయలుదేరినారు. వీళ్ళెవరో మహాత్ముల సేవకై బయలుదేరినారని ఊహించిన అన్నయ్య ఆ చీకటిరేయి రహస్యంగా వారిని అనుగమించినాడు. దంపతులు ఊరిబయట కొండగుహలో ప్రవేశించినారు. అందులో ఒక తేజోరాశి మహాపురుషు డున్నాడు. దంపతులాయనకు షోడశోపచార పూజలుచేసి ఆశీస్సులు ప్రసాదము అందుకున్నారు. చాటుగా చూస్తున్న అన్నయ్య ధైర్యంచేసి ముందుకురికి ఆ మహా పురుషునికి సాగిలపడినాడు. ఆ మహాత్ముడు అన్నయ్యను అఖండజ్ఞాన ప్రాప్తిరస్తని దీవించి ప్రసాదమిచ్చినాడు.

అన్నయ్య సన్న్యాసం స్వీకరించి హుమ్నాబాదులో మాణిక్యప్రభువులను సేవించి దివ్యదేశాలు తిరిగి అనేకయోగులను దర్శించి వారి బోధలు గ్రహించి కొంతకాలం తరువాత సికింద్రాబాదుకు తిరిగివచ్చినాడు. జ్ఞానసంపన్నుడై ఇంటికి మరలివచ్చిన అన్నయ్యను ఎరిగినవారు, స్నేహితులు, పౌరులు చూచి ఆకృష్టులై అభిమానులై సేవించసాగినారు. అన్నయ్య తనవద్దకు వచ్చేవారికి పురాణప్రవచనం చేస్తూ సుజ్ఞానం బోధించేవారు. ఇట్లా అన్నయ్య చుట్టు చాలామంది శిష్యులు అభిమానులు భక్తులు ప్రోగైనారు. అన్నయ్యను ఒకచోటనుండి మరొకచోటుకు పల్లకిపై ఊరేగింపుగా పగటి దివిటీలతో మేళతాళాలతో తీసుకపోయేవారు. అన్నయ్యగారికీవైభవం జరుగుతుండగా

శా.శ.౧౭౯౩ ప్రజోత్పత్తి సంవత్సరం ఆషాఢపౌర్ణమి ఆదివారం (2-7-1871)నాడు సికింద్రాబాదులోని పండితారాధ్యవీరశైవమఠంలో వీరశైవప్రముఖులంతా చేరి మంత్రి లింగారాధ్యులవారికి ఆశ్రమస్వీకారం పట్టాభిషేకం జరుపుతుండినారు. దానికి అన్నావధూతస్వాములను వేలూరు మునిస్వామి నాయుడు, జ్ఞానవేత్తలైన మధుసూద నార్యులు, కృష్ణార్యులు మొదలైనవారు ఛత్రచామరాందోళికా దివాప్రదీప భేరీమృదంగ వాద్యములతో శిష్యుల జయజయధ్వానాలతో తోడుకపోయినారు. ఆ దినాలలో అన్నావధూతలకు అచ్యుతరామ శాస్త్రిగారనే గొప్ప పండితులు బాసటగా ఉండేవారు. అచ్యుతరామశాస్త్రిగారు అవధూతల జ్ఞానసంపదను కొనియాడుతూ ప్రచారం చేసేవారు. వీరశైవమఠంలో అన్నావధూతలకు మంచి స్వాగతం లభించినది. ఆ దినాలలోనే శృంగేరీ జగద్గురువులు సికింద్రాబాదులో ఒకరింట భిక్షచేస్తుండగా ఎవరో అన్నావధూతల గురించి శ్రీవారికి నివేదించినారు. జగద్గురువులు అన్నావధూతలను తమ సన్నిధికి పిలిపించుకొని "మీరు అవధూతలెట్లైనారో చెప్పండి" అని ప్రశ్నించినారు. సమాధానంగా అన్నావధూతలు ఆశువుగా

**సీ॥ ఏ పాదయుగళంబు నెప్పుడు వీడక, శ్రీదేవి తా సేవచేయుచుండె**
**ఏ పాదములు సోకి యిలమీద బండయయి పడియున్న యహల్య పడతి యయ్యె**
**ఏ పాదతీర్థంబు నెప్పుడు పార్వతీపతి తలధరియించును పరమనియతి**
**ఏ పాదయుగళంబు ఇలమీద నటియింప అవని భారంబెల్ల నడగిపోయె**
**అట్టి పాదంబునందు నే నవతరించి, దేశికేంద్రుని సత్కృపాదృష్టి చేత**
**బోధరూపుండనై యాత్మభోగమంది, దురితములుద్రుంచి అన్నావధూత నైతి॥**

అని చెప్పినారు. జగద్గురువులు మెచ్చి అన్నావధూతలను గౌరవించినారు.

అన్నావధూతలవారు శిష్యులతో పుణ్యక్షేత్రాలు తిరిగేవారు. ఒకసారి శ్రీవారు శిష్యులతో కాశీకి పోయినారు. అక్కడ ప్రతిదినం గంగలో క్రుంకులిడి విశ్వేశ్వరునికి వేదోక్తంగా అభిషేకం చేసేవారు. ఒకనాడొక కాశీపండితుడది గమనించి అన్నావధూతల

కులగోత్రాలు తెలిసికొని మీరిట్లు చేయటానికి అధికారం లేదన్నాడు. ఒక పండితసభ ఏర్పాటు చేస్తే నా అధికారం ఏమిటో నిరూపిస్తామన్నారు అన్నావధూతలు. ఆతడు కాశీవిద్యాలయం పండితులను తదితరులను 40 మందిని ఆహ్వానించి పండితసభ ఏర్పాటు చేశినాడు. అన్నావధూతతో పండితమండలివారు తొమ్మిది దినాలు వాదించినారు. ఒక పండితుడు వితండవాదం చేస్తుంటే అన్నావధూత విసిగి రాజరాజేశ్వరిని ప్రార్థించినారు. కరుణార్ద్రయైన అమ్మవారు అన్నావధూతల నావేశించినది. అపుడు అవధూతలవారు అఖండప్రజ్ఞతో ఉరుములురిమినట్లు గర్జిస్తూ తమ ప్రతిభా పాండిత్యాలు ప్రదర్శిస్తూ మహోపన్యాసం చేసి కాశీపండితుల ముఖపిధానం చేయించినారు. మధ్యవర్తులైన పండితులు అన్నావధూతల ప్రజ్ఞాపాటవముల కలరి

**అఖండ భూమండల సాధుమండనో**
**బృహద్వశిష్ఠాన్వయ సింధు చంద్రమా,**
**విద్యానిధి స్తత్వసు భూషణోజ్జ్వలో**
**హ్యన్నావధూతాత్మ విదౌ శిఖామణిః!** అని పొగడి సన్మానించినారు.

అన్నావధూతలు మిత్రశిష్య సమేతులై కాశీనుండి బయలుదేరి ఉత్తరభారతంలోని పెక్కు ప్రదేశాలు తిరిగినారు. జబల్పూరు, సాగర్, జగన్నాథం, బరంపురం, విజయనగరం, విశాఖపట్నం మీదుగా రాజమహేంద్రవరం చేరినారు. వారు విడిది చేసిన ప్రతిచోట పండితసభల్లో ప్రసంగించి జ్ఞానబోధ చేసినారు. అటుతరువాత కాకినాడ, బందరు, గుంటూరు, గుత్తి, బళ్ళారి, బెంగుళూరు, చాందా వంటి ప్రముఖ నగరాల్లో వేదాంతబోధ చేసినారు. ఆయా ప్రదేశాల్లో శ్రీవారికి చాలామంది శిష్యులైనారు. శ్రీవారు కొన్నిచోట్ల బృహద్వాశిష్ఠ పీఠాలు నెలకొల్పినారు. అన్నావధూతల వారీవిధంగా 3 సార్లు కాశీయాత్ర చేసినారు. కాశీకి పోయినప్పుడల్లా కొన్ని క్రొత్త ప్రదేశాలకుపోయి జ్ఞానబోధ చేసేవారు. వేదాంతగోష్ఠులు సల్పేవారు. చివరిసారి యాత్రలో కడపకు వచ్చి అక్కడ తమ పీఠానికి హుసేన్‌దాసును అధిపతిని చేసినారు. కొంతకాలం కడపలోనే

ఉండి వ్యాధిగ్రస్తులైనారు. వెంటనే సికింద్రాబాదుకు తిరిగి వచ్చినారు. తాము శరీరం చాలించే సమయం ఆసన్నమైనదని 10 దినాలముందే ప్రకటించినారు. ముఖ్యశిష్యులను భక్తులను రప్పించుకున్నారు. శా.శ.౧౮౧౧ విరోధి సంవత్సర మార్గశిర శుద్ధఅష్టమి శనివారం (30-11-1889) పగలు 3 గంటలకు యోగంద్వారా ప్రాణం విడిచినారు. అన్నావధూత తమ పార్థివశరీరాన్ని సమాధిచేయవద్దు దహనం చేయండని ముందుగానే తమ శిష్యులకు చెప్పినారు. కనుక వారి భౌతికకాయాన్ని అగ్నిదేవునికి అర్పించినారు. అచలమార్గంలో ప్రముఖులైనవారి సమాధులు దక్కకుండా పోవటం దైవికచిత్రం. భాగవతుల కృష్ణప్రభువుల రచనవలె అన్నావధూతల రచనలు అచలమార్గానుయాయుల్లో బాగా ప్రచారంలో ఉన్నవి.

అన్నావధూతల రచనల్లో 1. రాజరాజేశ్వరీ శతకం సుప్రసిద్ధ నారాయణ శతకం, రామరామ శతకం వలె గేయరూపంగా 111 చరణాలతో ఉన్నది. 2. హంస శతకం 111 కంద పద్యాలు. దీని ప్రారంభంలో

**శ్లో॥ నిర్గుణం నిష్కలం నిత్యం నిర్వికారం నిరామయమ్,**
**మాయాతీత మనాద్యంతం, మల్లయార్య గురుం భజే॥**

**కం॥ గురు మల్లేశ్వర వాక్యము, హరిహర వాణీశులకును ఆనందంబై**
**సరి లేక వెలుగుచుందును, మరువక సేవింతు గురుని మదిలో హంసా॥**

దీని చివరన గద్య. ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమల్లేశ్వర గురువర్యపాదపద్మభృంగము అన్నయ పరమహంస విరచిత హంస శతకము" అని యున్నది. మల్లేశ్వర గురువు ఎవరు? బేగంపేటలో ఆ దినాలలో ఉండిన మొగుడంపల్లి మల్లయ్య గారనే వైశ్యులే అన్నావధూతల ప్రథమ గురువులు. 3. గురువాక్యతారావళి "పూర్ణ బోధస్వరూపాయ పుణ్య పాపవివర్జితః, నిర్గుణాయ సదా శ్రీమద్వేంకటేశ గురుం భజే" శ్లోకంతో ప్రారంభమైనది అనుచు వెంకట గురువరుండానతిచ్చె మకుటంతో ఇరవైయేడు సీసపద్యాలున్నవి. ఇతి శ్రీమత్పరమహంస భూమానంద యోగీంద్ర

అన్నావధూత వేదాంత శిఖామణి విరచిత గురువాక్యతారావళి సంపూర్ణము. 4.అఖండా నంద బోధార్ధ కందార్ధదరువులు. ఇందులో మొదటి కందార్థంలో శ్రీధర, రామావధూత, సదానంద, వెంకటార్యగురుపరంపర యున్నది. ఇవి 119 కందార్ధ దరువులు. 5. శివజ్ఞానాష్టకస్తోత్రం 9 శ్లోకాలు, 6. చరమానుష్ఠానం రెండు పుటల గద్యరచన. దీని గద్య "ఇయ్యది శ్రీమద్వేపురు వంశపయఃపారావార రాకాసుధాకర వంజరికుల పవిత్ర నృసింహార్య పుత్రరాజరాజేశ్వరీ వరప్రసాద జనిత సరస కవిత్వవైభవ అఖండ భూమండల సాధుమండనో బృహద్వాశిష్ఠాన్వయ సింధు చంద్రమ విద్యానిధి సత్యభూషణోజ్జ్వలే"త్యాది బిరుదాంకిత అన్నావధూత ఆత్మవిదౌ శిఖామణి యని ప్రసిద్ధి చెందిన పరమ భూమానంద యోగీంద్రప్రణీతంబైన అఖండానంద బోధయను అన్నావధూత అనుభవ ప్రకాశిక సర్వంబు నేకాశ్వాసము సంపూర్ణము.

ఈ గద్యములో అన్నావధూత తాను వంజరికులంవాడనని స్పష్టంగా చెప్పుకున్నాడు. శ్రీ శృంగేరీ జగద్గురువులకు ఆశువుగా సమాధానం చెప్పిన సీసపద్యంలో శ్రీ మహావిష్ణువు పాదం మహిమ వర్ణించి ఎత్తుగీతి ప్రథమపాదంలో "అట్టి పాదంబు నందు నేనవతరించి" తమ శూద్రత్వం చాటినారు. నిశ్చింత సూగూరార్యుల "మహనీ యుల చరిత్రలో అన్నావధూత బ్రాహ్మణుడని యున్నది తప్పు. అన్నావధూత భాగవతుల కృష్ణప్రభువు ఒకరితో నొకరు వివాదపడినట్లు అన్నావధూత కృష్ణ ప్రభువును శపించినట్లున్నది కూడ ఎంతవరకు సత్యమో తెలియదు.

అన్నావధూత గొప్ప రాజరాజేశ్వరీ ఉపాసకులు, మంత్ర సిద్ధులు. వారు దేవీనవరాత్రులు మహావైభవంగా జరిపేవారు. వేల జనులు భక్తులు అభిమానులు ఆ ఉత్సవాల్లో పాల్గొనేవారు. ఒకనాడు ఉత్సవాలప్పుడు అమ్మవారి సహస్రనామాలు చెప్పుతూ కుంకుమార్చన చేస్తుంటే పీఠంమీద అమ్మవారు తాండవమాడుతున్నట్లు పూజ చూస్తున్నవారి కందరికీ గోచరించినది. అప్పుడు శిష్యులు స్వామీ ఏదైనా మహిమ చూపండి అన్నారు. అన్నావధూత గంటం తీసుకొని పీఠంమీద ఉన్న అమ్మవారి

కలశాన్ని పొడిచినారు. వెంటనే కలశ రంధ్రంనుండి రక్తం ప్రవహిస్తుంటే శిష్యులది చూచి భయభ్రాంతులైనారు. వారు గురువుల వారిని క్షమాభిక్ష వేడి రక్తం ఆపుమన్నారు. అవధూతలవారు చిటికెడంత పూజాకుంకుమ తీసి కలశరంధ్రానికి రాసినారు. రక్తప్రవాహం ఆగిపోయింది. ఇంతటి శ్రీవిద్యోపాసకులైన అన్నావధూతలవారు ఒక్కొక్కసారి సారాయి కొట్టులోనికి దూరి సీసాలకొలది సారాయి గుక్క త్రిప్పుకోకుండా త్రాగేవారు. వారే అంగడిలో దూరి సారాయి త్రాగితే ఆకొట్టు యజమానికి ఆనాడు రెండింతలు మూడింతలు లాభాలు వచ్చేవి. ఒక్కొక్కప్పుడు త్రాగిన సారాయిని మూత్రంగా విసర్జించేవారు. అవధూతలు తమను దర్శించవచ్చేవారికి అప్పుడప్పుడు రాళ్ళు ఇచ్చేవారు. ఆ రాళ్ళు వారు కోరుకున్న పండ్లుగా, మిఠాయిలుగా మారేవి. శ్రీవారు దేశసంచారం చేస్తుంటే అసూయాపరులు మంత్రప్రయోగాలు చేసేవారు. ఒక మాంత్రికుడు నారాయణాస్త్రము ఉగ్రనరసింహము ప్రయోగించినాడు. అవధూతలవారు నమ్రులై నమస్కరించగనే అవి శాంతించి తిరిగి పోయినవి.

శ్రీవారు కరుణార్ద్రహృదయులు ధనిక పేద అనే భేదం లేకుండా అందరికీ సహాయం చేసేవారు. తమ కలవడిన సిద్ధులతో ప్రజానీకానికి తమను నమ్ముకున్న వారికి తమ భక్తులకు అభిమానులకు సహాయం చేసినారే కాని ఎవ్వరికీ అపకారం చేయలేదు.

ఆధారం :

1. అఖండానంద బోధయను అన్నావధూత అనుభవ ప్రకాశిక ప్రథమభాగము హైదరాబాదు 1930.
2. మహాత్ముల జీవిత చరిత్రలు కీలక సంవత్సరం (1968-1969) గుప్త పంచాంగం-పీఠిక.
3. మహనీయుల చరిత్ర - నిశ్చింతసూగూరార్యులు కర్నూలు -1968.